# ఆత్మషట్కము-5

## ( శ్రీ శంకరాచార్యులవారు)

శ్లో॥ నాహం జాతో న ప్రవృద్ధోన నష్టో
దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహం
కారస్యైవ హ్యాత్మనో మే శివోఽహమ్.

తా॥ పుట్టుట, పెరుగుట, నశించుట- అనునవి నాకు అవి ప్రకృతిధర్మములు, దేహధర్మములు అని శాస్త్రములందు వర్ణింపబడినది. చిన్మయాత్మ స్వరూపుడనగు నాకు కర్తృత్వ భోక్తృత్వములు లేవు. అవి అహంకారధర్మములు. నేను కేవలము శివస్వరూపుడను.

వ్యాఖ్య :- ఆత్మ దేహేంద్రియములకు అతీతమైనది. ప్రకృతికి పరమైనది. అది జడముకాదు. చేతన స్వరూపము. ఆకాశము కంటెను అతి సూక్ష్మమైనది. అది దేహము కాదు. దేహమునకు సాక్షి. కావున దేహధర్మములగు జనన మరణాదులుగాని, అహంకార ధర్మములగు కర్తృత్వాదులు గాని ఆత్మకు లేవు. ఈ ప్రకారముగ ఆత్మానుసంధానము చేయుటవలన జీవునకు మహద్ధైర్యము, ఆనందము, పరమశాంతి లభించగలవు.




సంపుటము : 25 సెప్టెంబరు 1993 సంచిక 9



| | |
|---|---|
| సంపాదకులు : | బి. ఈశ్వర్ |
| సహాయ సంపాదకులు : | బోధచైతన్య, M.A. ఓంప్రకాశ్ B.Sc. |
| సంవత్సర చందా : | రూ. 30/-లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/-లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

# అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక



: [illegible] :

ముల్లోకాలకు మూలపురుషా! [illegible]
మూడు పదనాల మో[illegible]!
గజాననా! గణనాథా! వినాయకా!
నమోనమః.



## (బుద్ధావతారము–9)

ధరాబద్ధ పద్మాసన స్థాంఘ్రియష్టి
ర్నియమ్యానిలాన్యస్త నాసాగ్రదృష్టిః
య ఆస్తే కలౌ యోగినాం చక్రవర్తీః
స బుద్ధః ప్రబుద్ధోస్తు నిశ్చిన్తవర్తీః.

పద్మాసనమునం దాసీనులై, నాసికాగ్రమందు దృష్టిని నిలిపి, నిర్వికల్ప సమాధియందు పరమానందము ననుభవించుచున్న యోగిరాట్టయిన బుద్ధదేవుడు మాకు ప్రబోధమును కలుగజేయుగాక! అట్టి బుద్ధస్వరూపులైన పరమాత్మకు నమస్కారము.

Look at the 'ocean' and not at the 'wave'. See no difference between ant and angel.

సముద్రమునే చూడుము; తరంగమును కాదు. భేదబుద్ధిని విడచి చీమను, దేవతను సమానముగనే గాంచుము.



**G**et up, and set your shoulder to the wheel,-How long is this life for? As you have come into this world, leave some mark behind otherwise where is the difference between you and the trees and stones?

లెండు! నడుము కట్టుడు! ఈ జీవితము ఎంతకాలము ఉండును?! ఈ జీవితము దేనికొఱకు?! ఈ ప్రపంచములో జన్మించినందులకు ఏదియైన ఘన కార్యమును సాధించవలెను. వచ్చినందులకు ఏదియైన గుర్తు ఉండవలెను. లేనిచో మీకును, ఈ చెట్లకును, రాళ్లకును ఏమి భేదము కలదు? ○○

# బుడగవంటి జీవితము

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ప్రాణియొక్క జీవితము అత్యంత క్షణికమైనది. దీర్ఘజీవితమైనను, హ్రస్వజీవితమైనను కాలముచే గ్రస్తమైయుండుటవలన అనంతకాలమున ఆ జీవితములన్నియు క్షణికములైనవేయగును. బుద్బుదప్రాయమగు అట్టి జీవితమును శాశ్వతమని నమ్ముకొని సమయమునంతను ప్రాపంచిక విషయానుభవమునందే గడపివేయుట, భగవంతుని విస్మరించుట అత్యంత ప్రమాద హేతువైయున్నది. ఒకచోట ఒక కప్ప నోరు తెఱచుకొని ఎదుటనున్న ఒకానొక పురుగును భక్షించుటకై ఆనందముతో ముందుకు వచ్చుచున్నది. ఆ పురుగును చూడగనే కప్పయందీ క్రింది భావపరంపరలు చిందులు త్రొక్కదొడగెను—

"ఆహా! నా జీవితము ధన్యమైనది. చక్కని యాహారము లభించినది! ఎటువంటి భోగ్యపదార్థము! నా అదృష్టమే అదృష్టము! జీవితము ఎంత ఆనందమయమైనది! ఇట్టి పురుగు ఇదివరలో నాకేనాడును లభ్యము

కాలేదు! ఇంక కొద్దిసేపటిలో దానిని భక్షించుటవలన నాకు అపూర్వమగు ఆనందము కలుగగలదు!" –కప్ప ఈ ప్రకారముగ ఎన్నియో భావములను తనలో కల్పించుకొని ఆనందపడుచు ముందున్న భోగ్యవస్తువును చూచి మురిసిపోవుచున్నదేకాని, తన వెనుకనేమి జరుగనున్నదో దానిని మాత్రము తెలిసికొనజాలకున్నది. వెనుక నొక పాము నోరు తెఱచుకొని ఆ కప్పను భక్షించుటకు వచ్చుచున్నది. కప్పకు ముందున్న పురుగుపైననే దృష్టి కలదు కాని, వెనుకనున్న పాముపై కాదు. అసలు పాము అనునది అచ్చోట కలదనికాని, అది దానిని మ్రింగుటకు వచ్చుచున్నదనికాని అది కలలోగూడ తలంచియుండలేదు. దాని దృష్టి ఎదుటనున్న భోగ్యవిషయముపైననే కలదు; వెనుకనున్న మృత్యువుపై కాదు.

అట్లే అజ్ఞానులగు జీవులు తమ దృష్టినంతను ఎదుటనున్న ప్రాపంచిక భోగ్యపదార్థములపైననే కేంద్రీకరించుదురు. వానినే తమ సర్వస్వముగ నెంచుకొనుచు శబ్దాదివిషయములే గొప్పయని భావించుచు రానున్న మృత్యువును గూర్చిన యోచనయే లేకయున్నారు.

[illegible]

అనునట్లు కొప్పుపట్టుకొని ఆడించుచున్న కాలుని (మృత్యువును) ఎవరును కనుగొనుటలేదు. వాస్తవముగ ప్రతి ప్రాణియు భూలోకమునగాని, స్వర్గలోకమునగాని, పాతాళలోకమునగాని నివసించుటలేదు. మృత్యుముఖమున నివసించుచున్నాడు. కాలుని కరాళవదనమున ఆసీనుడైయున్నాడు. 'విశన్తి నాశాయ సమృద్ధవేగాః' –అని గీతాచార్యులు పలికినట్లు ఆ కాలుని నోటిలో చప్పరించివేయబడుటకుగాను ప్రాణికోట్లు వేగముగా ప్రవేశించుచున్నవి.

కాబట్టి ఇటువంటి ప్రమాదకరమైన పరిస్థితి యందున్నప్పటికి మనుజుడు అజ్ఞానవశమున తన జీవితము యొక్క క్షణికత్వమును గుర్తెఱుఁగక, పాంచభౌతిక శరీరమునందు శాశ్వతత్వమును ఆరోపించు

కొనుచు, ఎదుటనున్న తళుకుబెళుకులతో గూడిన విషయములను జూచి హర్షాన్వితుడగుచున్నాడు. సుందర భోజనము, సుందర శరీరము, సుందర భవనము– ఇవియే గొప్పగ తలంచినవాడై, వానికొఱకై రాత్రింబగళ్లు విరామములేక యత్నించుచు తుట్టతుదకు అన్నిటిని వదలివైచి కన్ను మూసుకొనిపోవుచున్నాడు. తన వెనుక పొంచుకొనియున్న మృత్యువును తెలిసికొనక ముందున్నదే సత్యమని భావించి దాని సంపాదనకై పడరాని పాట్లు పడుచున్నాడు. కాని ఆ తన ప్రయత్నమధ్యముననే మృత్యువాతనిని గ్రసించివైచుచున్నది. తత్ఫలితముగ నతడు నిష్ఫలజీవితుడగుచున్నాడు.

కావున వివేకవంతుడగువాడు ప్రాపంచిక భోగములపై ఆసక్తిని విడనాడి తన వెనుక కాచుకొనియున్న మృత్యువును గమనించి, ఆ మృత్యువు తనను కబళించివేయుటకు ముందుగానె ఆ మృత్యువును తానే జయించుటకు– అనగా ఆత్మానుభూతిచే అమరస్వరూపుడగుటకు ఉపాయముల నన్వేషింపవలయును. అంతియేకాని కథలోని కప్పవలె కన్ను మూసికొని విషయభోగములకై గంతులిడుచు జీవితము నిరుపయోగము చేయరాదు.

ఇక కథలో ఇంకను ఏమి జరిగినదో తెలుసుకొందము– పురుగు వెనుక కప్ప, కప్ప వెనుక పాము, పాము వెనుక నెమలి, నెమలి వెనుక పులి, పులి వెనుక బోయవాడు– ఈ ప్రకారముగ ఒకదానివెనుక నొకటి ఎదుటి దానిని చంపివేయు ప్రయత్నములో నున్నవి. వెనుకనేమి జరుగుచున్నదో ముందున్నవానికి తెలియదు. సాక్షాత్ మృత్యుదేవత అన్నిటికిని వెనుక కాచుకొనియున్నది. ఆ సంగతి ఆ ప్రాణులకు తెలియదు. ఇంకొక్క క్షణములో అవియన్నియు మృత్యుదేవతకు బలికానున్నవి. కాని ఆ విషయము నెఱుగక ఆ దౌర్భాగ్యజీవులన్నియు తమ ముందున్న భోగ్యవిషయమునే గొప్పగ దలంచి, వానికొఱకై పరుగులిడుచున్నవి. ఈ విషయమునే కవి పుంగవుడు ఈ క్రింది విధముగ చక్కగ వర్ణించి చెప్పెను.

భేకోధావతి తం చ ధావతి ఫణీ సర్పం శిఖీధావతి
వ్యాఘ్రోధావతి కేకినం విధివశా ద్వ్యాధోఽపి తం ధావతి
స్వస్వాహార విహార సాధన విధౌ సర్వేజనా వ్యాకులాః
కాలస్తిష్ఠతి పృష్ఠతః కచధరః కేనాపి నోదృశ్యతే

దీని యర్థము పైన దెలిపినదే. కాబట్టి శ్రేయఃకాములగు జీవులు ఈ పాంచభౌతిక కాయముపై విశ్వాసముంచక, దానియొక్క క్షణికత్వమును మఱల మఱల జ్ఞాపకముచేసికొనుచు, కబళించివేయుటకు సదా సన్నద్ధమై యున్న మృత్యువును తెలిసికొని, ఎదుటనున్న ప్రాపంచిక భోగ్యవస్తువుల యెడల విరాగముగల్గి, దృష్టిని శాశ్వతపరమాత్మపైననే కేంద్రీకరించి వివేకాదులచే సచ్చిదానందపరమాత్మరూప స్వస్వరూపమును సాక్షాత్కరించుకొనుట ద్వారా మృత్యువును జయించివైచి అమరులై, అక్షరులై, అవ్యయులై వరగుదురుగాక!!

ఓమ్ తత్ సత్ ○○

## నిశ్శేషముగ తొలగించవలెను

వాసనాయాస్తథా వహ్నేః
ఋణవ్యాధి ద్విషామపి
స్నేహవైర విషాణాం చ
శేషస్స్వల్పోఽపి బాధతే॥

**వాసన (జన్మాంతర దుస్సంస్కారము) అగ్ని, అప్పు, రోగము, ద్వేషము, రాగము, శత్రుత్వము, విషము—అనునవి కొంచెము మిగిలియున్నను బాధించును. కావున వాటిని సమూలముగ, నిశ్శేషముగ పెకలించివేయవలెను.**

('ఋణశేషము, అగ్నిశేషము, వ్యాధిశేషము—మున్నగునవి వుండగూడదు. అవి అపకారమును కలుగజేయును'— అని పెద్దలు చెప్పుదురు. కాబట్టి హృదయమును లెస్సగ పరిశోధించి, వాసనాదులను సమూలముగ తుడిచివేయవలెను. అపుడు మాత్రమే జీవుడు శాంతిని నోచుకొనగలడు.)

# "వైష్ణవ జనతో

శ్రీ గాంధీ మహాత్మునకు ప్రియమైన "వైష్ణవజనతో" అను గుజరాతీ పద్యమునకు స్వేచ్ఛానువాదము.

భగవంతుని నిజమైన ఋషి :
ఇతరుల కష్టసుఖాలను తనవిగా భావించుకునేవాడు
గర్వంలేనివాడు
ఇతరుల గురించి చెడు మాట్లాడనివాడు
అందరినీ గౌరవంగా భావించేవాడు
సద్భావన చేసేవాడు
మోహాలు, భావాలు తన స్వాధీనంలో ఉంచుకున్నవాడు
ఎప్పుడూ సత్యాన్నే మాట్లాడేవాడు
ఇతరుల ఆస్తిపై చేతులు వేయనివాడు
స్వచ్ఛమైనవాడు
పవిత్రమైనవాడు
చిత్తభ్రమ పొందనివాడు
భౌతిక విషయాలపట్ల వైముఖ్యంగల
మేధగలవాడు
దురాశ, పాపపు ఆలోచనలు
ఆత్మలో చొరబడనివాడు
భగవంతుని నామాన్ని ప్రేమించేవాడు
భగవంతుని పవిత్ర దేవాలయం
మానవ దేహమని తెలుసుకున్నవాడు;
వితరణశీలి అతడు.
కపట తంత్రాల నుండి విడివడిన వాడు;
క్రోధానికి లోబడనివాడు
అటువంటి ఒక వ్యక్తి
తన సాన్నిధ్యం ద్వారా
చుట్టూ వున్నవారిలో కూడా
పవిత్రత చేకూరుస్తాడు

OO

# శ్రీ బోధచైతన్య గారు

వర్షరుతువులో ఒకచోట నిలుకడగా వుండి సాధనచేసుకొనే ఆచారం సన్న్యాసుల్లో వుంది. జేతవనంలోని ఇద్దరు భిక్షువులు బుద్ధుని నుండి తమకు సరిపడే ధ్యానవిషయాలను, ధ్యానపద్ధతులను తెలుసుకొని ఒక అడవిలోని విహారంలో వర్ష రుతువును గడపడానికి వెళ్ళారు.

ఒక భిక్షువు అధ్యాత్మ సాధన విషయంలో జాగ్రత్తలేనివాడు, సోమరి. వర్ష రుతువును చీకూచింతా లేకుండా గడిపివేయడమే పరమలక్ష్యంగా పెట్టుకొన్నాడు. పెద్ద వర్షం వచ్చి కుటీరం కప్పునుండి నీరు కారితే ఏమి చేయాలి అని ఆలోచించి గడ్డిమోపులు సేకరించి పెట్టుకొన్నాడు. జడివాన కురిసి చలివేస్తే ఏమి చేయాలి అని ఆలోచించి చలికాచుకోవడానికి ఎండుకట్టెపుల్లలు సేకరించిపెట్టాడు. వర్షం వచ్చి అంతా బురద అయినప్పుడు కాలికి బురద తగలకుండా ఉండడానికోసం కుటీరం ముందు పల్లంగా వుండే చోట్లలో పెద్ద పెద్ద రాళ్ళు పాదాలు మోపడానికై ముందు జాగ్రత్తగా వేసుకొన్నాడు. ఒకోసారి వారం రోజులు కూడా విడువకుండా మబ్బులు మూసుకొని వర్షిస్తాయి కనుక వస్త్రాలు అదనంగా రెండు జతలు ఉంచుకొంటే మంచిదని వాటిని కూడా సంపాయించి పెట్టుకొన్నాడు.

వర్షాలు కురిసి వెలిశాక అడవి అంతా తిరుగుతూ వర్షరుతువులో కనపడే వింత వింత కీటకాలను చూస్తూ "ఆహా, ఏమి సృష్టి! ఏమి సృష్టి!" అని ఆశ్చర్యపోతుండేవాడు. ఏమీ తోచనప్పుడు కనపడిన నలుగురిని చేరదీసుకొని పిచ్చాపాటి మాట్లాడేవాడు. ధ్యాన విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు ఒక మొక్కుబడిగా, ఒక ఆచారంగా కాసేపు కళ్ళు మూసుకొని కూర్చొని లేచి మళ్ళీ తన మామూలు ధోరణిలో పడిపోయేవాడు. అతని చాతుర్మాస్యం ఇలా గడిచింది!

(తరువాయి [illegible] పేజీలో)



హే కరుణాకర హే పరమేశ్వర
హే జగదాలయ పాలయమాం
హే నిరుపాధిక నిరుపమ నిర్మల
హే జగదీశ విలోకయ మామ్.
జయజయ శివశివ జానకి రాం
జయరఘునందన రాధేశ్యాం
గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద రథాంగపాణే
గోవింద గోవింద ముకుంద కృష్ణ
గోవింద గోవింద నమోనమస్తే
శివాయనమ ఓం నమశ్శివాయ
భవాయనమ ఓం నమో భవాయ
హరాయనమ ఓం నమోహరాయ
సాంబసదాశివ సాంబసదాశివ
సాంబసదాశివ పాహిమామ్
శంభో హరహర శంభో హరహర
శంభో హరహర రక్షమాం
రాధారమణ మదనమోహన
బృందావన చంద్రకృష్ణ
రాధే గోవింద కృష్ణ
రాధే గోపాలకృష్ణ
శ్రీ విశ్వేశ్వర నమోనమో
శ్రితజన రక్షక నమోనమో
అఖండ తేజా నమోనమో
అఖిలాండేశ్వర నమోనమో
ఆనందామృత నమోనమో
ఆపద్బాంధవ నమోనమో

౦౦

## [illegible]

ఒకనికి బోధ సరిగా ఒంటపట్టినది లేనిది అతని ఆచరణ ద్వారా తెలియుచుండును. వాక్కుద్వారా 'అంతయు బ్రహ్మమే, అంతయు దైవమే' అని చెప్పుచు పర ప్రాణికి అపకారము చేయుట సరియగు పద్ధతికాదు. అది **అనుభవవేదాంతము** కాదు. బోధను త్రికరణశుద్ధముగ ఆచరించవలెను. తాను సంకల్పించినదానినే చెప్పవలెను. చెప్పినదానినే చేయవలెను. వేదాంతము నిత్యవ్యవహారములో జొరబడవలెను. మహనీయులా ప్రకారమే కావించిరి. లేనిచో సిద్ధాంతము '**పుష్పితాం వాచమ్**' అనునట్లు నిష్ఫలమై పోవును.

కాబట్టి 'అంతట ఒకే ఆత్మకలదు' అను సిద్ధాంతము నాచరణయందుంచినపుడు సమస్తప్రాణుల యెడల దయ, కరుణ, ప్రేమ కలిగియుండవలసివచ్చును. తన దేహమునకు, తన మనస్సునకు తానెట్లు సుఖమును, శాంతిని, దుఃఖాభావమును కోరుచున్నాడో, అట్లే పరుల విషయమై కూడా భావింపవలెను. ఇదియే **ఆత్మౌపమ్యస్థితి**. ఈ ప్రకారముగ సుఖదుఃఖములందు తనతోబాటు సమానముగ ఇతరులనుగూడ చూచునట్టి యోగియే యోగులందఱిలోను సర్వశ్రేష్ఠుడు.

కాబట్టి మనుజులలో శ్రేష్ఠత్వము వారి ఆచరణపై ఆధారపడియున్నది. 'ఓ జీవులారా! 'అంతయు బ్రహ్మమే' అను సిద్ధాంతమును ఆచరణలోనికి తీసికొనివచ్చి సర్వజీవుల యెడల ప్రేమను, కారుణ్యమును వర్షింపజేయుడు. అపుడే మీరు నిజమైన భక్తులు, యోగులు కాగలరు' అని భగవానుడు గీతలో నిస్సంకోచముగ చెప్పియుండెను. ఈ వాక్యములు వాచా వేదాంతులగు సోమరులకు కనువిప్పు కలిగించునవియై యున్నవి. అధ్యాత్మరంగమున 'వాచావేదాంతము'నకు, సోమరితనమునకు చోటులేకుండచేయుటకు కాబోలు ఇట్టి తమఃప్రభంజక వాక్యములను భగవానుడు గీతలో అపుడపుడు పలుకుచుండును.

కావున ముముక్షువులు జాగరూకులై 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాది పరమార్థసూత్రములను ఆచరణయందుంచి సర్వ భూతములను తనవలె జూచుచు దయార్ద్రహృదయులై వర్తించవలెను. అట్టివారే భగవద్దృష్టిలో సర్వశ్రేష్ఠులు.

పశ్చిమదేశములందు మతమున, సంఘమున, 'సోదరత్వము' (Brotherhood)నకు జనులు చాల ప్రాముఖ్యతను జూపుదురు. మంచిదే. కాని అది చాలదు. ఏలయనిన, సోదరులలోగూడ పరస్పరమెన్నియో వైమనస్యములు, అభిప్రాయ భేదములు, వైరములు ఉదయించుచున్నవి. కావున సోదరత్వము ప్రేమయొక్క పరాకాష్ఠను సూచించనేరదు. గీతాది గ్రంథములు, ఉపనిషత్తులు ప్రేమయొక్క చరమస్థితిని బోధించుచు 'ఆత్మౌపమ్యభావము'ను జనులలో నుద్బోధించినవి. 'సోదరత్వమును' దాటి ఒక మెట్టు ఇంకను పైకిపోయి విశ్వమునంతను ఒకే ఆత్మరూపముగ కౌగలించుకొనునట్లు చేసినవి. ఇదియే **గీతయొక్క, ఉపనిషత్తుల యొక్క ఘనత; హైందవమత సిద్ధాంతము యొక్క ప్రకర్షత.**

ప్రేమ జూపవలసినది ఏ ఒకరిద్దరిపైననే కాదు. కేవలము మానవులపైననే కాదు. సమస్త చరాచర భూతకోట్ల యెడల దయాది సద్గుణములను ప్రదర్శించ వలెను. మనుజుడు సామాన్యయోగులవలెనుండక (ఆత్మౌపమ్యదృష్టిగలిగి) యోగు లలో సర్వశ్రేష్ఠుడై చెన్నొందవలెను. OO

---

*(10వ పేజీ తరువాయి)*

రెండవ భిక్షువు అలా కాదు. వినయపిటకంలో చెప్పిన 140 భిక్షు నియమా లను తు.చ. తప్పకుండా పాటిస్తూ ఎక్కువ సమయాన్ని ధ్యానాభ్యాసానికి కేటా యిస్తూ సాధనలో నిమగ్నమయ్యాడు.

వర్షరుతువు అయ్యాక ఇద్దరూ జేతవనం చేరారు. బుద్ధుడు వారిద్దరినీ గమ నించి సాధనపథంలో ఒకడు బాగా వెనుకబడి వుండడం, రెండవవాడు చాలా ముందుకు పోయి ఉండడం తెలుసుకొని క్రింది శ్లోకాన్ని పఠించాడు.

అప్రమత్తః ప్రమత్తేషు సుప్తేషు బహుజాగరః
అబలాశ్వమివ శీఘ్రాశ్వో హిత్వా యాతి సుమేధాః

—ధర్మపదం 2–9

అధ్యాత్మ విషయాల్లో ఏమరుపాటు, సోమరితనం కలిగినవారికంటే స్మృతి మంతుడు, జాగరూకుడైనవాడు అధ్యాత్మమార్గంలో వేగంగా పురోగమిస్తాడు. బల మైన, వేగవంతమైన గుఱ్ఱం పరుగు పందెంలో బలంలేని గుఱ్ఱాన్ని దాటుకొని చాలా ముందుకు వెళ్లగలుగుతుందిగదా!

ముముక్షువులు రెండవ భిక్షువువలె ఆధ్యాత్మికరంగమున పురోగమనము సలుపుచు జీవితమును ఆనందమయముగ ఒనర్చుకొందురుగాక! OO

# శ్రీ సాధు బసవయ్య గారు (కాగుపాడు)

**మా**నవజన్మ లభించినది ప్రార్థనా పూజాస్తోత్ర జపతపోధ్యానాది పారమార్థిక సాధనలద్వారా జన్మమృత్యు సంసార చక్రమునుండి విముక్తిని బొందుటకే యగును. కాని మనుష్యుడు అజ్ఞానవాసనావశంగతుడై బహిర్ముఖుడై, విషయాసక్తుడై, భోగలాలసుడై కాలము గడుపుచున్నాడు. విషప్రాయములైన విషయములు జీవుని మృత్యువుపాలు చేయుచున్నవి. మాయామోహితుడైన నరుడు విషయభోగములు అత్యంత దుఃఖకరములని యెఱింగియు ముళ్లతుప్పలు తిను ఒంటెకైవడి చర్వితచర్వణుడై ఐహికసుఖములననుభవించుచున్నాడు. మానవుడు ఐహికవిషయ వ్యసన వశంగతుడై యున్నంతవఱకు సంసారక్లేశముల ననుభవింపక తప్పదు. మాయామోహిని విషయాభిముఖుడైన పురుషుని, కామిని తన ప్రియుని కామాసక్తునిజేయు భంగి చంచలాత్ముని జేయుచున్నది. జీవుడు మాయామోహిని బారినుండి విడివడుటకు భగవచ్ఛరణాగతియే సదుపాయము.

'[illegible]'

అని మనసార అనన్యభక్తితో భగవంతునకు శరణాగతుడైనచో జీవునకు భగవంతుని యనుగ్రహము లభించును. బంధవిముక్తి కలుగును. మర్త్యునకు భక్తి రసామృతసేవనమే అమృతత్వ ప్రాపకమగును.

భూలోకము కర్మభూమియని విఖ్యాతిగాంచినది. '[illegible] సిద్ధిర్భవతి కర్మజా' అని గీతావాక్యము. ఇహలోకమునందు నరునకు సత్కర్మాచరణముచే గలుగు ఫలము అచిరకాలముననే లభించగలదు. ఈ లోకమున మానవుడు సత్కర్మాచరణముచే దేవుడుగాను, దుష్కర్మాచరణముచే అసురుడుగాను రూపొందగలడు. సత్కర్మాచరణశీలుడై సద్గతిని బొందదలంచిన మనుజునకు సజ్జన సాంగత్యము అత్యంతావశ్యకమగును. 'త్రిజగతి సజ్జనసంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా' అని శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు ఆనతిచ్చినారు. సాధుజన సాంగ

త్యము త్రిలోకములయందును సంసార వారాశితరణోపాయమగు నావయగునని భావము.

మానవజన్మ సాఫల్యము జెందుటకు సజ్జనసంగము పావనమైన ఉపాయము. అని ఆప్తవాక్యము. సజ్జనులకు సత్పురుషుల సాంగత్యము ఎంతో పుణ్యఫలముగా దైవయోగమున గలుగగలదు. లోకమునందు సత్పురుషులు ప్రాప్తించుట అత్యంత దుర్లభము, సముద్రమునందలి రత్నములను బడయదలంచినవాడు బహుప్రయాసతో యావచ్ఛక్తి తదర్థమై ప్రయత్నించుపగిది, శ్రేయస్కాముడైన మానవుడు సత్పురుషుని గాంచుటకై వ్యయప్రయాసలుపడి వెదకవలయును. యావచ్ఛక్తి ప్రయత్నశీలుడై అన్వేషించు పురుషునకు సత్పురుష సందర్శనభాగ్యము చేకూరగలదు. లోకమునందు సత్పురుషాశ్రయమెంత దుష్ప్రాపమైనదో పరిశీలింపుడు!

పర్వతములెన్నో యున్నను వానిలో మాణిక్యముగలుగు పర్వతమెట్లు దుర్లభమో, గజయూథములెన్నో యున్నను వానిలో ముత్యములుగలుగు గజరాజమెట్లు దుష్ప్రాపమో, అడవులలో వృక్షములెన్నోయున్నను వానిలో శ్రీగంధవృక్షమెట్లు దుర్లభమో అట్లే లోకమునందు సాధువులు, సన్న్యాసులు అనేకులు అచ్చటచ్చట గానబడుచున్నను వారిలో శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడును, బ్రహ్మజ్ఞాన సంపన్నుడును, సద్గురువునగు సాధుపుంగవుడు లభించుట కష్టాత్కష్టమగును.

సాధనశీలునకు సాధుజన సమాశ్రయము లభించినచో అతని జన్మ సర్వధా సఫలమగుననుట నిజము. ఇహలోకమున ముముక్షువైన మనుష్యునకు సత్పురుష సాంగత్యము శ్రేయోమార్గదర్శకము, పాపసంహారకము, పవిత్రతాపాదకము, తాపత్రయవినాశకము, శుభప్రదాయకము, సంసారదుర్గతారకము, శాశ్వతమోక్షధామప్రాపకము, జన్మసాఫల్యకారకమునగు సాధన రత్నమనజెల్లును. మోక్షకాంక్షియగు మనుజునకు సాధుజనసంగతిద్వారా విషయాసంగము నశించిపోవును. విషయవిరక్తిచే జీవుని హృదయము నావరించిన అజ్ఞానమోహము పటాపంచలైపోవును. మోహనాశముద్వారా తత్త్వసాక్షాత్కారము కలుగును, ఆత్మజ్ఞానలాభముచే జీవన్ముక్తి స్థితి చేకూరును. 

# అసూయయొక్క దుష్ఫలితము

**ఒ**క పట్టణములో నడిబొడ్డున ఒక ఆసుపత్రి కలదు. అందు రోగులకు ఉచితముగ చికిత్సచేసి, ఔషధములను ఒసంగి పంపుచుండెడి వారు. వ్యాధిగ్రస్థులు సుదూరప్రాంతములనుండి అచటకు వచ్చి ఆరోగ్య మును బడసి, ఎంతో సంతోషముతో తమ స్వగృహములకు వెడలుదురు. ఆ వైద్యశాలయందు నియమింపబడిన వైద్యులు కూడ మంచి నైపుణ్యము గడించినవారై, వచ్చిన రోగులను ప్రేమతో, వాత్సల్యముతో విచారిం చుచు, వారికి తగిన సలహాలను, మందులను అందజేయుచుండిరి.

ఆ వైద్యశాలయందు నేత్రచికిత్సా విభాగము ఒకటి ఏర్పాటుచేయ బడియున్నది. అందు నేత్రరోగులకు ఉచితముగ శస్త్రచికిత్సగావించి, వారికి సరిపడు కంటి అద్దములను ఇచ్చి పంపుచుండిరి.

ఒకపుడు పట్టణములో పెద్ద కలహము జరిగెను. అందులో ఒక పార్టీవారు మరొక పార్టీవారిపై రాళ్ళను, గాజుముక్కలను విసరుకొనిరి. ఆ పోరు ఇంకను ఉధృతమగుటవలన పోలీసులు రంగములో ప్రవేశించిరి. ఆ కొట్లాటయందు అప్పటికే ముందుభాగమున ఉన్న కొందరి ముఖము లపై తీవ్రముగ దెబ్బలు తగిలినవి. ఆ పార్టీలో ఒకనికి, ఇవతల పార్టీనం దలి ఇరువురకు కండ్లలో గాజుముక్కలు పడినవి. కొద్దిసేపటిలో పోలీసులు జోక్యము చేసుకొని ఇరువర్గములలోని ముఖ్యులను అరెస్టుచేసిరి. వారిలో కండ్లయందు గాజుముక్కలు పడినవారు కూడ ఉండుటవలన, వారిని వెంటనే సమీపమునగల ఉచిత వైద్యశాలలో చేర్పించిరి.

అచటగల నేత్రవైద్యుడు వారిరువురకు శస్త్రచికిత్సచేసి కన్నులకు గంతలు కట్టించి, వారిని ఇట్లు హెచ్చరించెను–"మీరు శిరస్సును ఏమాత్రము కదల్చక అటులనే పరుండియుండవలెను. ఒకవేళ తలను కదల్చినచో ఇక మీకు దృష్టి వచ్చుట కష్టము" అని పలికి ఆ వైద్యుడు వెడలిపోయెను. ఆ ప్రత్యర్థులు ఇరువురిని ప్రక్కప్రక్కనగల మంచములందు పరుండబెట్టిరి.

ఒక గంట అయిన పిదప ఆ ఇద్దరిలో ఒకని శరీరముపై ఏదియో ఒక వస్తువు పడెను. వెంటనే అతడు బెదరిపోయి గభాలున లేచి కూర్చొనెను. అపుడతనికి డాక్టరుగారు ఆదేశించిన విషయము స్మృతికి వచ్చెను. అతడు తనలో ఇట్లు ఆలోచించుకొనసాగెను–"డాక్టరు గారు చెప్పినప్పటికిని నేను కదలితిని. కావున ఇక నాకు దృష్టి వచ్చుట అసాధ్యము. నా దృష్టి పోయినది. ఇటువంటి పరిస్థితులలో నా ప్రక్కనే కదలక వున్న నా ప్రత్యర్థికి కంటిచూపు ఏల సరిగా ఉండవలెను. అది నాకు అవమానము. కావున నేను ఇపుడు వానిని కూడ కదలించి, లేచి కూర్చుండబెట్టెదను. అపుడు వానికి కూడ దృష్టి రాదు" అని తలంచి మొదటివాడు మెల్లగా తన ప్రక్కనేయున్న ప్రత్యర్థిని సమీపించి అతనిని కుదిపి, లేపి కూర్చుండబెట్టెను.

అంతట రెండవవాడు ఆక్రోశించి, మొదటివానితో కలహించుచు గట్టిగా కేకలు వేయసాగెను. వారి కేకలను విని డాక్టరుగారు పరుగెత్తుకొని వచ్చి చూడగా, వారిరువురు లేచి పోట్లాడుకొనుచుండుటను చూచి నిర్ఘాంతపోయెను. తన సలహాను పాటించక ఆ ప్రత్యర్థులు ఇరువురు తమ దృష్టిని పోగొట్టుకొనినందులకు డాక్టరుగారు ఎంతయో విచారించిరి. ఈర్ష్య, అసూయవలన అపకారమేకలుగునుగదా అని ఆ వైద్యుడు ఆశ్చర్యపోయెను.

నీతి : అసూయ అను దుర్గుణము అసురసంపదలో ప్రథమ స్థానమును బడసినది. ఆ ఒక్కటి ఉన్నచో తక్కిన సుగుణములన్నిటిని



చెప్పులు సుఖమును కలుగజేయును. తప్పులు దుఃఖమును కలుగజేయును.

ధర్మమునాచరించినచో ఆ ధర్మమే అతనిని కాపాడును.

ఆత్మానుభూతి కలవానికి వాచాలత్వము ఉండదు.

సామాన్యుడు ధర్మమును గూర్చి ఎక్కువగా మాట్లాడును. కాని ఆచరింపడు. జ్ఞాని ధర్మమును గూర్చి అధికముగ ప్రసంగింపడు. కాని ఆచరించును.

లోవెలుగు సహాయముతో నడచుటను అలవఱచుకొనవలెను.

మానవుని సేవించుటయే మాధవసేవయగును. విశ్వమును ప్రేమించుటయే విశ్వేశుని పూజయగును.

తండ్రిప్రేమ దాగియుండును. తల్లిప్రేమ బయటపడును. ○○

○○

# శ్రీ రామకృష్ణపరమహంస ఇట్లు చెప్పిరి—

పూర్ణ దైవభక్తి, విశ్వాసము, ప్రేమగలవాడు శీఘ్రముగ భగవదనుభూతిని పొందును. ముముక్షువు ఆధ్యాత్మిక గ్రంథములను, సచ్ఛాస్త్రములను పఠించి అందు తెలుపబడిన శమదమాది, యమనియమాది సాధనలను ఆచరించవలెను. సత్సాంగత్యమును అవలంబించి, సద్గురువును శరణుపొంది, భగవంతునకు ఆత్మార్పణము గావించుకొనవలెను. మనస్సులోగల దుర్గుణములను తొలగించుకొనుచు, సద్గుణములను అలవరచుకొనుచు ధ్యానాదులను సలుపుచుండవలెను. కొంతకాలమునకు దైవకృపచే, గురుకృపచే అతడు ఆత్మసాక్షాత్కారమును బడసి నిత్యానందమును అనుభవించును.

గోవులు అన్నియు ఒకే విధముగ అరచును. ఆ విధముగనే ఆధ్యాత్మిక అనుభూతిని బడసిన మహనీయులందరు విశ్వమంతటిని ఆత్మస్వరూపముగ, దైవస్వరూపముగ వీక్షించుచు సర్వభూతదయ, ప్రేమ, పరోపకార స్వభావమును కలిగియుందురు. సంసారచక్రమున తగుల్కొని దుఃఖించుచున్న అజ్ఞానులకు సద్బోధలను గావించి, వారిని దైవమార్గమున మళ్ళించుదురు.

ధాన్యమును నిలువజేయు ధాన్యాగారమునందు ఎలుకలను పట్టుటకు అక్కడక్కడ ఎలుక-బోనులను పెట్టుదురు. ఆ బోనులలో కొబ్బరిముక్కనుగాని, మరే ఆహారపదార్థమునుగాని ఉంచుదురు. ఎలుక ధాన్యపుసంచి సమీపమునకు పోవు మార్గములోగల బోనులో ఉన్న కొబ్బరిని తినుటకు అందులో ప్రవేశించును. కొబ్బరిని కొఱికగనే దానికి ఏర్పాటుచేయబడియున్న తలుపు మూసికొనిపోవుటచే ఎలుక అందు బంధింపబడుచున్నది. ఆ విధముగనే ఆనందనిలయుడగు భగవంతుని పొందగోరు మానవుడు విషయానందము కొరకై ప్రాకులాడరాదు. ఒకవేళ విషయాసక్తి కలిగియున్నచో అతడు విషయ ప్రపంచముననే తిరుగాడుచుండును. ఇక ఆధ్యాత్మిక పురోభివృద్ధిని పొందజాలడు. కావున సాధకుడు దృశ్యసుఖము అశాశ్వతము అని భావించి, తీవ్రవైరాగ్యము కలిగి, ధ్యానాదులను సలుపుచు భగవత్ప్రాప్తిని బడసి శాశ్వతానందమును అనుభవించవలెను.

# శిక్షణ సంప్రదాయము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

నిమిత్తం మనశ్చక్షురాది ప్రవృత్తౌ
నిరస్తాఖిలోపాధి రాకాశకల్పః
రవిర్లోక చేష్టానిమిత్తం యథా యః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా

**మనస్సు, నేత్రములు మొదలగువాని ప్రవృత్తియందు నిమిత్తమాత్రమైనదియు, సమస్త ఉపాధిరహితమైనదియు, ఆకాశమువంటిదియు, సూర్యుడు లోకవ్యవహారమునకు నిమిత్తమాత్రముగ నుండునట్లు జగద్వ్యవహారమునకు నిమిత్తమాత్రముగ సాక్షిగ నుండునదియు, ఏది ఎల్లప్పుడు పొందబడియే యున్నదో, నిత్యబోధస్వరూపమైనదో అట్టి ఆత్మయే నేను.**

---

4. కొందరు అనేక సంవత్సరములు తపస్సుచేసి నీటిపై నడచుట మొదలగు సిద్ధులను సాధింతురు. సిద్ధులను పొందుట మానవుని చరమలక్ష్యము కానేకాదు. భగవత్సాక్షాత్కారమును బడయుటయే మానవజీవితము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. సిద్ధులకై, లౌకికసుఖములకై ఆశపడువాడు పరిపూర్ణశాంతిని, ఆనందమును ఎన్నటికిని పొందలేడు. అమూల్యమైన మానవజన్మను పొందిన జీవుడు అణిమాదిసిద్ధులను సంపాదించుటయందు కాలమును గడుపక ధ్యానాదులను గావించి భగవద్దర్శనమును నొందుటకు ప్రయత్నించి కృతార్థుడుకావలెను.
5. కొందరు అహంకారమును కలిగియుందురు. తమకు గొప్ప ధనమున్నదని, కీర్తిప్రతిష్ఠలు కలవని, తమకంటె అధికులు మరెవరును లేరని వారు తలంచుచుందురు. కాని వివేకముతో విచారించినచో అపరిమితుడగు భగవంతుని శక్తిసామర్థ్యముల ఎదుట, దేశకాలక్రియలచే బద్ధుడగు మానవుని శక్తిసామర్థ్యములు చాల అల్పములని తోచును. అనేక కోట్ల సంవత్సరముల నుండి విశ్వమును నడిపించుచున్న మహత్తరశక్తియే భగవానుడు. కాని, మనుజుడు చిన్న సంసారమును పోషించుటకు కూడ జీవితమంతయు కష్టపడుచుండును. కనుక అపారశక్తిమంతుడగు భగవంతుని శరణుపొంది, భగవద్భక్తికలిగి, దైవపథమున, ధర్మమార్గమున జీవించుటయే మానవుని ప్రధాన కర్తవ్యము.



# శ్రీ రవీంద్రనాథ టాగూర్ గారు

*(శ్రీ రవీంద్రనాథ టాగూర్ గారు రచించిన "గీతాంజలి" అను గ్రంథము వలన వారికి నోబెల్ బహుమతి లభించినది. దానిలో భక్తిరసపూరితమైన ఒకానొక పద్యము ఈ క్రింద ప్రచురింపబడినది.)*

Where the mind is without fear and the head is held high
Where knowledge is free
Where the world has not been broken up into
fragments by narrow domestic walls,
Where words come out from the depth of truth
Where tireless striving stretches its arms towards perfection
Where the clear stream of reason has not
lost its way into the dreary desert sand of dead has it
Where the mind is led forward by thee intoever-widening thoughts
and action into that heaven of freedom, my father, let my
country awake.

ఎచట మేధ భయరహితమో,
ఎచట శీర్షముత్తుంగమో,
ఎచట జ్ఞానము స్వేచ్ఛాపూరితమో,
ఎచట సంకుచిత స్వదేశి గోడల మధ్య ప్రపంచం పగిలి ముక్కాముక్కలు కాదో,
సత్యమనే లోతులనుండి మాటలు ఎక్కడ వెలువడుతుంటాయో,
పరిపూర్ణతకోసం అలుపు లేకుండా
ప్రయాసపడే హస్తాలు ఎక్కడ వ్యాపిస్తాయో...
మృతిచెందిన అలవాట్లనే నిరాశామయ ఎడారి
ఇసుకలోకి హేతువనే స్వచ్ఛ ప్రవాహం ఎక్కడ ఇంకిపోకుండా ఉంటుందో;
నీ మేధ ఎక్కడ నిరంతర విస్తృత ఆలోచనా,
పోరాటాలవైపు పురోగమిస్తుందో...
ఆ స్వేచ్ఛాస్వర్గంలో.. ఓ పితా!
నా దేశం మేల్కొనుగాక!

# డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

**(తిరుపతి)**

***ప్రశ్న : లోకంలో అనేకరకాల తపస్సు చేసేవారున్నారు. ముక్కు మూసుకొని కొంగజపం చేసేవారూ వున్నారు. ఉత్తమమైన తపస్సెన్ని రకాలు? అరణ్యాలకు పోయి తపస్సు చేయకుండా సంసారంలో చేయగలిగిన తపస్సులు ఎలా ఉంటాయి?***

**జవాబు :** తపస్సు చేయడానికి అరణ్యాలకు పారిపోనక్కరలేదు. గృహస్థుడుగా వుండి కూడా శారీరక–వాచిక–మానసిక తపస్సులను మూడింటిని చేయవచ్చు. భగవంతుణ్ణి, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పరిశుభ్రంగా వుండటం, కపటం లేకుండా వుండటం, బ్రహ్మచర్యాన్ని పాటించడం 'అహింస' ఇవి శారీరక

తనకు, వినేవారికి కూడా మానసిక క్షోభ కలుగకుండా వుండేటట్లు పరుషంగా లేకుండా మాట్లాడడం, సత్యభాషణం, ప్రియంగా హితాన్ని చెప్పడం, వేదాన్ని, స్తోత్రాలను పారాయణచేయడం వాక్కుతో చేయదగిన తపస్సులు. మనస్సును ప్రసన్నంగా వుంచుకోవడం, శాంతంగా వుండటం, మౌనం, మనోనిగ్రహం, శుద్ధమై, సంస్కారపూర్ణమైన భావపరంపర ఇవి మానసికమైన తపస్సులు. ఈ మూడు రకాలైన తపస్సులు ఉత్తమమైనవి. వీటిలో సిద్ధి కలుగకుండా ఏదో అరణ్యానికి పోయి ముక్కు మూసుకొని కూర్చున్నందువల్ల, వేషాలు వేసినందువల్ల ఏమీ లాభముండదు.

(భగవద్గీత 17-14)

**: "యోగ్యుడని, ఇవ్వాలి" అని కొన్నింటిని కొంతమందికిస్తాం. ఫలాపేక్షతో కొన్నింటినిస్తాం. ఇష్టం లేకపోయినా అయోగ్యులకు కూడా తప్పనిసరై విసుగుతో కొన్నింటినిస్తాం. ఈ మూడింటికి తేడా ఉందా? ఇవి ఎలాంటి దానాలు?**

**జవాబు :** చాలా తేడా ఉంది. పవిత్రమైన ప్రదేశంలో, మంచి పర్వకాలంలో, యోగ్యుడైన వ్యక్తికి ప్రత్యుపకారాపేక్ష లేకుండా కర్తవ్యబుద్ధితో ఇవ్వాలని ఇచ్చే దానం

తిరిగి ఉపకారాన్ని పొందాలనే కాంక్షతో, లేక గొప్ప ఫలాన్ని ఉద్దేశించిగాని, చాలా బాధపడుతూ ఇచ్చే దానం

అయోగ్యమైన ప్రదేశంలో, యోగ్యంకాని కాలంలో, అయోగ్యులకు, నిర్బంధం వల్ల, విసుగుతో ఇష్టం లేకుండా ఇచ్చే దానం

ఈ మూడింటికీ ఫలంలో చాలా తేడా ఉంది. సాత్త్వికదానంవల్ల మంచి ఫలం, రాజసదానంవల్ల మధ్యఫలం కలుగుతుంది. తామసదానంవల్ల ఫలం కలుగదు సరికదా! అనర్థం కూడా కలుగుతుంది.

(భగవద్గీత 17-20) OO

## దివ్యరథము

Body is the chariot
Soul is the rider
Intellect is the charioteer
Organs are the horses
Mind is the rein
శరీరమే రథము
ఆత్మయే రథికుడు
బుద్ధియే సారథి
ఇంద్రియములే గుఱ్ఱములు
మనస్సే కళ్ళెము

# నామకరణం

**ఈశ్వర్**

ఏ వ్యక్తి అయినా ఈ లోకంలో ఆవిర్భవించగానే నామకరణం చేయుట పరిపాటి. కొందరి పేర్లకు వారి ఆచరణకు సంబంధం వుండదు.

**ఉదాహరణకు :** ఒక వ్యక్తి పేరు ప్రేమమూర్తికాని ఆచరణలో ద్వేషమూర్తి.

మరో వ్యక్తి ధర్మారావుకాని అధర్మపనులలో ఆరితేరిన వ్యక్తి.

మరో వ్యక్తి పేరు వివేకమూర్తి. అవివేకపనులు తప్పితే ఒక్కటి కూడ మంచి పని చేయడు.

ఇంకో వ్యక్తి పేరు పుణ్యమూర్తి కాని చేసే పనులన్నీ పాపపు పనులే. ఒకతని పేరు ఆనందరావు కాని ఎప్పుడూ ఏడుపే.

ఎక్కడో వుంటారు మహానుభావులు. వారి పేరు వింటేనే పుణ్యం. వారిని దర్శిస్తే మరీ పుణ్యం. అట్టి పుణ్యపురుషుని చరిత్ర ఒకటి ఉపనిషత్‌లో వుంది. అట్టి పుణ్యపురుషుడు ఎక్కడికో ప్రయాణమై వెళ్ళుచుండగా మార్గమధ్యంలో ఒక సాధువు కనిపించి–"నాయనా! నీ పేరు ఏమి?" అని అడిగెను.

"నా పేరు మోహజిత్" అని సమాధానమిచ్చెను.

"పేరు చాలా బాగుందికాని, నీ పేరులోని అర్థము నీకు తెలుసా?"

"తెలియకేమీ, స్వామీ! మోహమును, వ్యామోహమును, అజ్ఞానమును జయించినవాడను అని అర్థం."

"అయితే నీవు నిజముగ జయించినావా?"

"నేనొక్కడినేకాదు మా ఇంటిలోనివారందరూ జయించినారు"

"అయితే నీ అడ్రసు నాకివ్వు, నేను తిరిగి వచ్చేవరకు నీవు ఇక్కడనే వుండు" అని ఆ సాధువు అడ్రసు ప్రకారం అతని తల్లిదండ్రులవద్దకేగి–"ఏమండీ! మీ పుత్రుడు మోహజిత్తు అడవిలో ఒక సింహముచే చంపబడినాడు. అతని రక్తసిక్తమైన వస్త్రములు ఇవిగో చూడుడు" అని ఏడుస్తూ చెప్పనారంభించెను.

ఆ తల్లిదండ్రులు నవ్వుతూ, "ఎందుకయ్యా ఏడుస్తున్నావు. '**జాతస్య హి ధ్రువో మృత్యుః**' పుట్టినవాడు తప్పక చావవలసిందే. పుట్టినప్పుడు ఒక్కడే పుట్టుట లేదు. మరణము కూడ కలిసి పుట్టినది. ఇందులో ఏడుపుకు అవకాశం లేదు"- అని సమాధానములిచ్చిరి ఆ తల్లిదండ్రులు.

ఆ సాధువు వెంటనే వెనుతిరిగి మోహజిత్‌వద్దకేతెంచి, "అయ్యా! నేను నీ అడ్రసు ప్రకారం నీ తల్లిదండ్రులవద్దకేగితిని. నీ తల్లిదండ్రులిరువురు చనిపోయినారు" అని విషాదవదనముతో విషయమును వివరించగ, ఆ మోహజిత్తు, "స్వామీ! ఆత్మజ్ఞానమును ఆర్జించిన నాకు ఏమాత్రము బాధలేదు. తల్లిదండ్రులు, బంధువులు, సంసారం, ఆస్తి, అంతస్తులు-ఇవన్నియు స్వప్నములోని సంపదలవంటివి. మేలుకొనినవాడు స్వప్నములోని సంపదలగూర్చి, వ్యక్తులగూర్చి ప్రాకులాడడు. కనుక నాకు ఏ వియోగదుఃఖము లేదు"

ఆ ప్రత్యుత్తరము విని సాధువు సంతసించి-"నాయనా! నీవు సార్థకనామ ధేయుడవు. నిన్ను పరీక్షించుటకే నీ జననీజనకులు మరణించారని చెప్పాను. వారు సజీవముగనే యున్నారు" అని పలికి వెడలిపోయెను.

కావున దేనిని గూర్చి విచారించక మంచిగ వుండి మంచిపనులు చేసి మానవ ధర్మము నెరవేర్చినవాడే మోహజిత్.

మనము కూడా మోహజిత్‌ను ఆదర్శంగా తీసికొని మన పేరుకు మానవత్వా నికి న్యాయము చేకూర్చి ధన్యులమవుదాం. ○○

## వాలఖిల్యా ఉవాచ

ఇదం శరీరం శతసంధిజర్జరం
పతత్యవశ్యం పరిణామదుర్లభమ్
కిమౌషధం పశ్యసి మూఢ దుర్మతే
నిరామయం కృష్ణరసాయనం పిబ.

ఓ మానవుడా! ఈ శరీరము పలువిధములగు సంధులతో గూడినది. అనుక్షణము మార్పుచెందునది. అవశ్యముగ పతనమొందునది. దీనిని రక్షించుటకై ఔషధాదుల కొఱకు బాధపడుచున్నావేమి? సకలరోగములను పోగొట్టునట్టి శ్రీకృష్ణనామామృతమును పానము చేయుము.



# యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

మనోవృత్తులే సంసారమను విషవృక్షమునకు ఉత్పత్తిస్థానము, భోగవాసనా సంక్షయముద్వారా వానిని నిగ్రహించుటద్వారా మనస్సును సంయమమొనర్చినచో సంసారభ్రమ శమించి ఆత్మప్రాప్తియను మోక్షము లభించును. తన కభిలషితమైన వస్తువును త్యజించుటద్వారా చిత్తము సులభముగ జయింపబడును. సంకల్పముల యొక్క అభావమను శస్త్రముచే చిత్తమను వృక్షము సమూలముగ ఛేదింపబడి జీవునకు బ్రహ్మస్వరూపముదయించును.

కాబట్టి పురుష ప్రయత్నముద్వారా వాసనల నుద్మూలించి చిత్తమును అచిత్తముగ నొనర్చి నాశరహితమగు ఆత్మ సామ్రాజ్యస్థితిని బడయవలయును. మనస్సును మనస్సుచేతనే జయించవలెను. ఇంతకుమించి ఆత్మప్రాప్తికి మఱే యుపాయమున్ను లేదు. సంకల్పము యొక్క అభావమే అవిద్యానాశోపాయము.

ఓ రామచంద్రా! శుభాశుభ కర్మఫలములననుభవించునది చిత్తమేగాని ఆత్మ కాదు, జడమగు శరీరము కాదు.

మఱునాడా రాజు వింధ్యాచలారణ్యమునకుఁబోయి చూడగా తాను భ్రమ యందు గాంచిన చాండాలవాటికాది దృశ్యము నటగాంచెను. అచట తన చాండాల స్థితియందు తనయత్తయై యున్నస్త్రీ తన కుమార్తె మున్నగువారి వియోగమునకై విలపించుచుండ వారల కుచిత ధనాదుల నొసంగి కొంతకాలమట ఉండి పిమ్మట స్వదేశమునకు వచ్చెను. తదుపరి యారాజు 'భ్రమ' యందలి పదార్థములు జాగ్రత్తు నందు సత్యముగ నేల కానుపించెనని నన్నడుగ నేనిట్లు చెప్పితిని-'అవిద్యయం

1. సూర్యుని చుట్టూ తిరుగు గ్రహములలో ఐదవది గురు గ్రహం (బృహస్పతి). దీనిని 1610లో గెలీలియో కనిపెట్టెను. ఇది సూర్యుని నుండి 48 కోట్ల 33 లక్షల మైళ్ళ దూరమున గలదు. ఇది గ్రహములలోకెల్లా చాలా పెద్దది. దీనికి 12 ఉపగ్రహములు కలవు.

2. ఏనుగు మెదడు యొక్క బరువు దాని మొత్తం బరువులో $\frac{1}{600}$ వంతు ఉండును. మానవుని మెదడు బరువు అతని మొత్తం బరువులో $\frac{1}{60}$ వంతు ఉండును.

3. ఒక కాన్పునకు ఆవునకు ఒక పిల్ల, మేకకు 4 పిల్లలు, నక్కకు 10 పిల్లలు, పందికి 14 పిల్లలు పుట్టును.

4. కొన్ని రకముల చీమలు పరస్పరము పోట్లాడుకొనుచుండును. ఆ పోట్లాటలో కొన్ని చీమలు చనిపోవుచుండునుకూడ! గెలిచిన చీమలు ఓడినవాటి గుడ్లను తీసికొనిపోయి పెంచి తమ సేవకులుగా చేసికొనుచుండును.

5. 1988 సంవత్సరంనాటికి సముద్రములో 80,000 రకముల జంతువులు కనుగొనబడినవి.

6. ప్రపంచములోకెల్లా పెద్ద నగరము జపాన్ ముఖ్యపట్టణమగు టోక్యో. 1984 నాటికి దాని జనాభా 2 కోట్ల 80 లక్షలు.

7. 1938 సంవత్సరం డిశంబరు 5న కుదాబక్ష్ అను ఇరాన్ దేశస్థుడు అమెరికానందలి చికాగో నగరమునగల సెంట్రలు హాలులో 2 వేలమంది చూచుచుండగా కళ్లకు గంతలు కట్టుకొని న్యూయార్క్ టైమ్స్ దినపత్రికలోని అన్ని విషయములను చదివెను.

# ఆపన్నుని వేదాంతమే శరణ్యం

( శ్రీ వ్యాసాశ్రమానికి ఉత్తరాధికారిగా శ్రీ పరిపూర్ణానందగిరి స్వాములవారిని నియమించిన సందర్భంలో శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు 29.7.1993వ తేదీన శ్రీ వ్యాసాశ్రమం—సద్గురు—అధిష్ఠాన మందిరంలో కావించిన ప్రవచనం)

సేకరణ : శ్రీ నముద్రాల లక్ష్మణయ్య గారు,
సాహిత్య శిరోమణి, తిరుపతి

( శ్రీ సద్గురు మలయాళస్వాములవారు రచించిన 'గృహస్థాశ్రమ ధర్మములు' అన్న గ్రంథం పునర్ముద్రిత ప్రతిని పూజ్య శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు 29.7.1993వ తేదీన అధిష్ఠానమందిరంలో ఆవిష్కరించారు. తదుపరి తమ ప్రసంగం కొనసాగిస్తూ ఇలా అన్నారు—)

"ఆశ్రమాలు నాలుగు. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అని నాలుగాశ్రమాలనూ వ్యవహరిస్తున్నాము. ఎక్కువమంది జనులు ఎప్పుడూ గృహస్థా శ్రమంలోనే వుంటారు. తక్కినవారు అల్పసంఖ్యాకవర్గానికి చెందుతారు. అయితే వారు బలహీనవర్గాలవారు కారు – (సభలో నవ్వులు). ఇతరాశ్రమాలవారు గృహ స్థాశ్రమస్థులపై ఆధారపడి వుంటారు.

గృహస్థులు భోజనాది సౌకర్యాలు సమకూర్చి తదితరాశ్రమస్థుల అభివృద్ధికి దోహదం చేస్తారు. గృహస్థులు తరించడానికే శ్రీ సద్గురుస్వాములవారు ఈ గ్రంథం రచించారు. ఈ గ్రంథంలోని ధర్మాలను అధ్యయనంచేసి అనుష్ఠించడంవల్ల గృహ స్థులు తాము తరిస్తారు, ఇతరులు తరించడానికి సహాయంచేసినవారవుతారు.

పదిమందికి ఉపకారంచేసే స్వభావాన్ని అలవరచుకోవాలి. అది లేనందువల్లనే సమాజంలో దోషాలు చెలరేగుతున్నాయి. భేదభావం పనికిరాదు. దానివల్ల అపకారమే జరుగుతుంది. తన చెంపలు వాయించుకోవలసి వచ్చినప్పుడు ప్రతివాడూ ఏమాత్రం దెబ్బ తగలకుండా కొట్టుకొంటాడు. ఇతరుల చెంపలు వాయించవలసివస్తే బలం కొద్దీ వాయిస్తాడు. ఇందుకు కారణం భేదభావమే.

ఆధ్యాత్మిక ధర్మంలో తానొక్కడే కాక అందరూ బాగుపడేటట్లు ప్రయత్నిం

చాలి. 'మేరా భీ తేరా' (నాదికూడా నీకే) అనే పద్ధతిలో ఉండాలికాని 'తేరాభీ మేరా' (నీదికూడా నాకే) అనే పద్ధతిలో జీవించకూడదు. నీవు తరించు, బాగుపడు, ఇతరులు తరించడానికి, బాగుపడడానికి సహాయం చేయి.

తన స్వరూపాన్ని ఉన్నది ఉన్నట్లుగా, భావించడం ఉచితం. అలా భావించక మరొక రకంగా భావించడం పాపమవుతుంది. అది దొంగతనంక్రింద పరిగణింపబడుతుంది.

అన్యథా సంతమాత్మానం
యోఽన్యథా ప్రతిపద్యతే
కిం తేన నకృతం పాపం
చోరేణాత్మాపహారిణా।

ఆత్మాపహారం అనేది చౌర్యం. తన స్వరూపంను ఉన్నది ఉన్నట్లు తెలుసుకోవాలి. ఆత్మవిద్య ఈ ప్రయోజనాన్ని సాధించడానికే ఉన్నది.

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు సమస్తజనులూ తరించాలనే అనేక లోకోద్ధారక కార్యక్రమాలు కావించారు. అనుష్ఠానానికి శ్రీవారు అత్యంత ప్రాధాన్యం ఇచ్చేవారు.

గోగర్భంలో శ్రీ స్వాములవారు పండ్రెండు సంవత్సరాలు తపోనిష్ఠచేసి తరించారు. మాకు ఈ వ్యాసాశ్రమంలో పండ్రెండు సంవత్సరాలు గురుకులవాసం చేసే భాగ్యం కలిగింది. శ్రీవారు చిన్న విషయాన్ని కూడా గొప్పగా భావించి అనుష్ఠించేవారు. ఇతరులచే అలా అనుష్ఠింపజేసేవారు.

మాకు శ్రీవారి సన్నిధిలో క్రమశిక్షణతో కూడిన జీవితం అలవడింది. ఒకనాడు నేను కాలిక్రిందివరకూ వేలాడేటట్టు గుడ్డ కట్టుకొన్నాను. అది చూచి శ్రీవారు "కట్టుగుడ్డ కొంచెం పైకి ఉండాలి. క్రింద జీరాడగూడదు" అని చెప్పారు. వస్త్రధారణలో విలాసాలు తగవని శ్రీవారి అభిప్రాయం.

అలాగే ఎక్కడికైనా ప్రయాణమై వెళ్లేటప్పుడు భారమంతా ఒకరి చేతికిచ్చి తాను ఉత్తచేతితో పోరాదని ఒకసారి హెచ్చరించారు.

జనులకు సహజంగా పూర్వజన్మవాసనలు వుంటాయి. అందులో దుర్వాసనలు వారికి పతనం కల్గిస్తాయి. వాటిని తొలగించుకోవాలి. అది చాలా కష్టమే. అయినా సాధించాలి.

ఒక దొంగ ఒక బట్టల షాపులో దొంగతనంచేసి జైలుకు వెళ్ళాడు. శిక్షాకాలం పూర్తి అయిన తర్వాత విడుదల అయ్యాడు. మళ్లీ అదే షాపులో దొంగతనం చేసి పట్టుబడ్డాడు. "మళ్ళీ అక్కడే ఎందుకు దొంగిలించావు?" అని అడిగితే "'Visit once again' అని ఆ షాపులో వ్రాసి వున్నారు. అందువల్ల మళ్లీ అక్కడికే వెళ్లాను" అని చెప్పాడట! సంస్కారాలు అలా పనిచేస్తాయి.

దుర్గుణాలను జయించాలి. హిరణ్యకశిపుడు లోకాలన్నీ జయించాడు. కాని అంతరింద్రియాలను జయించలేక బాధకు లోనయ్యాడు. అందుకే ప్రహ్లాదుడు తండ్రిని–"నీవు నీ లోపలి శత్రువులను జయించలేదే?" అని ప్రశ్నించి చక్కని బోధ చేశాడు. అందుచేత మనస్సునూ, ఇంద్రియాలనూ నిగ్రహించి ఆత్మోన్నతి పొందటానికై పాటుపడాలి. ఇందుకు తగిన సాధనసంపత్తిని శ్రీ సద్గురు స్వాములవారు చక్కగా మనకు బోధించి వున్నారు. శ్రీవారు బోధించిన అనుష్ఠాన వేదాంతమే మనకు శరణ్యం.

ఈ దినం ఉదయం 4.25 గంటలకు శ్రీ వ్యాసాశ్రమము యొక్క ఉత్తరాధికారి నియమన మహోత్సవము జరిగింది. శ్రీ పరిపూర్ణానందగిరిస్వాములవారు 25 సంవత్సరాలు ఆశ్రమాధ్యక్షులైన శ్రీ విద్యానందగిరిస్వాములవారివద్ద బోధలు గ్రహించి ఆచరణలో పెట్టి ధన్యులైనారు. ఆధ్యాత్మికాభివృద్ధిని సాధించి శ్రీవ్యాసాశ్రమాభివృద్ధికి వారు పాటుపడుచున్నారు. అట్లే మున్ముందును శ్రీ వ్యాసాశ్రమాభివృద్ధికొరకై వారు ప్రయత్నింపగలరని విశ్వసించుచున్నాము. ○○

---

(20వ పేజీ తరువాయి)

దంతయు సంభవించును. దానిచే లేనిది యున్నట్లును, ఉన్నది లేనట్లును అగును. కాకతాళీయ న్యాయముచే చిత్తవాసనాకారణమున జనుల వ్యవహారములు ఎప్పుడైన పరస్పరము కలియుచుండును. లవణుని చిత్తసంస్కారము వింధ్యాచల చాండాలుని హృదయమునను చాండాలుని సంస్కారము రాజు హృదయమునకు రూఢియై యుండెను. కావున అట్లు సంభవించెను. యథార్థముగ ఈ అవిద్యయనునదియేలేదు. బ్రహ్మము ఒక్కటి మాత్రమే గలదు. మిగుల అనాత్మభూతమగు అవిద్య రూపమైన చిత్తమును, ఓ రామచంద్రా! నీవు దూరీకృతమొనర్చి శేషించిన ఆత్మయందు స్థిరుండవైయుండుము. శుభేచ్ఛాది సప్తభూమికలను క్రమముగ నారోహించి సంకల్ప(మనో) విలయముద్వారా స్వాత్మపదము బడసి పరమశాంతిని బొందవలయును. ○○

# వృడా మేలుకో!

ఆపాతరమణీయములగు ధన, భార్యాపుత్రాదులకొరకే జీవితమును వ్యర్థ పరచుట విజ్ఞత అనిపించుకొనదు. నశ్వరములగు దృశ్యపదార్థముల సంపాదనకొరకే తన శక్తియుక్తులను వినియోగించుట వివేకవంతుని లక్షణముకాదు. విజ్ఞుడైనవాడు అవిద్యారూపములగు ప్రాపంచిక సంపదలకై ప్రాకులాడక, కామక్రోధాది శత్రువులను జయించి, రామభక్తి, దైవభక్తిపరాయణుడై స్వాత్మసామ్రాజ్యమున స్థితిని బడసి మహోన్నత స్థానమలంకరించును.

కనుక జీవుడా! మహాత్ముల సదాచరణను, సద్గురువుల బోధలను ఆదరముతో గ్రహించు. గీతామాత హెచ్చరించినట్లు కామరాకాసికి, క్రోధరాకాసికి వశుడవుకాక, రామభక్తుడవై, భగవద్ధ్యానతత్పరుడవై, యథాప్రాప్తములగు సత్కర్మలను అనుష్ఠించు. చిత్తశుద్ధిని, జ్ఞానసిద్ధిని సంపాదించి ముక్తిధామమున ప్రవేశించు. ఇహపరలోకములందు పరమశాంతి సుఖములను అనుభవించు. అజ్ఞానతమోనిద్రనుండి మేల్కాంచి, ఆత్మ జ్ఞానానుభూతిని పొంది జీవితమును చరితార్థము చేసుకో. OO

**భగవంతుని మఱచిపోయి జనులు అనుభవించే రెస్టు (Rest) (విశ్రాంతి) రెస్టు కాదు. అది అరెస్టు (Arrest) (బంధనము) మాత్రమే యగును.**

# విజ్ఞానము - వికాసము

## నాలుకా! నీకు తీపివస్తువు కావాలా?

ప్రపంచంలో తీపివస్తువులెన్నో యున్నాయి. కాని అన్నిటికంటె తీపివస్తువు ఒకటున్నది. అదే భగవన్నామం. దానియొక్క మాధుర్యమును తెలిసినవారు ఇక దానిని విడిచిపెట్టరు. మధురాతిమధురమైన అట్టి భగవన్నామాన్ని నిరంతరం స్మరిస్తూ నామామృతాన్ని గ్రోలుతూంటారు. భగవన్నామమును ఉచ్చరించుట సులభము. అద్దానిని ఏల ఉచ్చరించరాదు? సామాన్యజనులు నాలుకకు ఇష్టమైన పదార్థాలు ఇవ్వాలని భావిస్తూ తీపివస్తువులను ఆరగిస్తూంటారు. ఆ తీపిదనం ఒక్క క్షణకాలం యుండి మరల అదృశ్యమౌతుంది. జిహ్వేంద్రియానికి కలుగు ఆ ఆనందం క్షణికమైంది. కడుపునిండితే గారెలు చేదు అన్నట్లుగ ఆ మధురపదార్థమే ఎక్కువగ తింటూంటే నాలుకకు వెగటు వేస్తుంది. అపుడు రుచి అరుచి అయిపోతుంది. సుఖం దుఃఖంగ మారిపోతుంది. ప్రపంచవస్తువుల యొక్క స్వరూపం ఇట్లాగే యుంటుంది.

కాని భగవన్నామం అట్లా కాదు. భగవన్నామామృతం త్రాగినకొలది ఆనందం ద్విగుణీకృతమౌతూంటుంది. దైవానుగ్రహం లభిస్తుంది. మనస్సుకు ఎంతో ప్రశాంతి చేకూరుతుంది. కాబట్టి తరింపగోరేవాడు "గోవిందా! దామోదరా! మాధవా! శ్రీహరీ! పరమశివా! నారాయణా!" అను భగవన్నామాలను ఎలుగెత్తి పాడుతూండాలి. "జపతో నాస్తి పాతకమ్" అనునట్లు భగవన్నామప్రభావంచే హృదయము పాపప్రక్షాళనమైపోతుంది. నిర్మలహృదయంలో జ్ఞానం అంకురిస్తుంది. జ్ఞానం చేత మోక్షం లభిస్తుంది.

లోకులెంతో శ్రమపడి ప్రాపంచికధనాన్ని సంపాదిస్తూంటారు. కాని అది అస్థిరం. పుణ్యధనం, జ్ఞానధనం స్థిరమైనవి. కాబట్టి వాటిని ముఖ్యంగ సంపాదించాలి. ప్రాపంచికసంపదలన్నీ. వైభవాలన్నీ దేహావసానకాలంలో వియోగం పొందుతూంటాయి. కాని పుణ్యధనం, భక్తిధనం, జ్ఞానధనం జీవుని వెంట ఎల్లప్పుడూ యుండి

కాపాడుతూంటాయి. కాబట్టి వాటిని వృద్ధిచేసుకోవాలి. వ్యర్థసంభాషణాలు నిలిపివేసి, నాలుకకు భగవన్నామస్మరణయను కార్యాన్ని అప్పగించాలి. ఒక భక్తుడు నాలుకను ఇట్లా ప్రశ్నించాడు.

నామానికి, నామికి అవినాభావసంబంధం యుంది. భగవంతుని నామం ఉచ్చరించినపుడు భగవంతుని స్వరూపం, భగవంతుని గుణగణాలు జ్ఞప్తికి వస్తూంటాయి. దానివల్ల పవిత్రత చేకూరుతుంది. పుణ్యం లభిస్తుంది. కాబట్టి జనులు వివేకవంతులై భగవన్నామోచ్చారణకు తమ జీవితంలో ప్రముఖస్థానమొసంగి, భగవత్కృపకు పాత్రులై ధన్యులు కావాలి. వ్యర్థకార్యకలాపాలతో జీవితాన్ని నిరుపయోగం చేయరాదు. సద్వినియోగం చేయాలి. మానవత్వం సార్థకం చేయాలి. మాధవత్వం పొందాలి. ఈ భావాలనే క్రింది శ్లోకము వ్యక్తపరచుచున్నది–

వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చి ।
అహో జనానాం వ్యసనాభిముఖ్యమ్
జిహ్వే పిబస్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి

OO

## PLEASE NOTE

That death is dancing behind you to devour you at any moment.

**మృత్యువు నీ చెంతనే నిన్ను కబళించుటకు సిద్ధముగ యున్నది– అని జ్ఞప్తియందుంచుకొనుము.**

(అట్లు తెలుసుకొని దైవకార్యములను విరివిగ చేయుము)

# సుభాషితములు

అవశేంద్రియచిత్తానాం హస్తిస్నానమివ క్రియా
దుర్భగాభరణప్రాయో జ్ఞానం భారః క్రియాం వినా

తమ తమ ఇంద్రియములను, మనస్సును స్వాధీనమునందుంచుకొనలేనివారికి ఎంత విద్యయున్నను, జ్ఞానమున్నను కురూపిణిని ఆభరణము పెట్టిన చందమునను, ఏనుగుకు స్నానము చేయించిన చందమునను వ్యర్థమేయగును.

సతాం ధనం సాధుభిరేవ భుజ్యతే
దురాత్మభిర్దుశ్చరితాత్మనాం ధనం
శుకాదయశ్చూతఫలాని భుంజతే
భవన్తి నింబాః ఖలు కాకభోజనాః

మంచివారి సొత్తు సాధుసత్పురుషుల నిమిత్తమే ఉపయోగపడుచుండును. దుష్టుల ధనము దుర్మార్గుల కొరకే వినియోగపడుచుండును. మామిడిపండ్లు చిలుకలకు ఉపయోగపడుచుండును. వేపపండ్లు కాకులకు వినియోగపడుచుండును.

(కావున సత్పాత్రులకు దానధర్మములు చేయవలెను.) ○○

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు

**శాశ్వత చందా రు. 300/-లు**

1. శ్రీ కోట గంగాధర్ గారు – మెట్‌పల్లి
2. శ్రీ ఎమ్. బాలీశ్వరరావు గారు – వనపర్తి
3. శ్రీ కె.ఎ. ఇందిర గారు – సికింద్రాబాద్
4. శ్రీ ఎస్. శివనాగిరెడ్డి గారు – పెనరవాయి
5. శ్రీమతి బి. మానెమ్మ గారు – మద్దూరు
6. శ్రీ ఎన్. సాంబయ్య గారు – హైదరాబాద్
7. శ్రీ డా॥ పి.టి. రెడ్డి గారు – వానియమ్ గడి
8. శ్రీ ఎ. విశ్వనాథ్ గారు – తిరుపతి

○○






## అభ్యుదయపథంలో కంటి ఆస్పత్రి

I శ్రీ కాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు త్రినేత్ర వైద్యాలయము—భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి కొలది కాలము క్రిందటనే 10 పడకలతో ప్రారంభింపబడినది. కాని రోగుల యొక్క సంఖ్య దినదినము పెరిగిపోవుచుండుటచే ఎక్కువమందికి చికిత్సకు అవకాశము కల్పించుటకై అది ప్రస్తుతము 20 పడకల ఆసుపత్రిగ రూపొందింపబడినది. ఆపరేషన్ కేసులన్నియు జయప్రదమగుటవలన రోగులు తిరిగి చూపును బడసి మహదానందభరితులగుచున్నారు. ప్రజల ఆనందమే మా ఆనందము. మానవసేవయే మాధవసేవ.

II శ్రీ టి. యోగయ్యనాయుడు గారు, పారిశ్రామికవేత్త, President-Chamber of Commerce, శ్రీ శుకబ్రహ్మాశ్రమ ఉపాధ్యక్షులు. వీరు స్వయంగా ఆస్పత్రిని పరిశీలించి, రోగులను పరామర్శించి రోగుల అవసరములను గుర్తించినవారై— రూ.25,000/— విలువచేయు 10 మంచములను, 10 పరుపులను, 10 బెంచీలను, 20 కుర్చీలను నూతనముగా ఏర్పాటుచేసిరి. వారి ఉత్సాహముతోనే 10 పడకల ఆస్పత్రి 20 పడకల ఆస్పత్రిగా రూపుదిద్దుకొన్నది. లోగడ వీరు 11,116 రూపాయిలు కూడా సమర్పించి శాశ్వత సభ్యులు (Life Member)గా చేరియుండిరి.

III **20** మంది రోగులకు ఆస్పత్రిలో కంటి ఆపరేషన్స్ ప్రతి గురువారము జరుగును. రోగుల తరఫువారు వుండుటకు, వారి సామాను భద్రపరచుకొనుటకు తగిన వసతి అవసరము అని ఆగస్టు నెలలో ఆశ్రమమునకు వచ్చిన ఆశ్రమ కమిటి ఛైర్మన్ శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, సహాయ కార్యదర్శులు శ్రీ బి. శ్రావణ్‌కుమార్ గారు, శ్రీ జి. శివయ్య గారు అభిప్రాయపడిరి. అట్టి నిర్మాణ ఏర్పాట్లు జరుగుచున్నవి. మరియు ఆశ్రమమునకు అవసరమగు విద్యుత్ లైన్లు—కేబుల్ ద్వారా వీధి దీపాలు వగైరా ఏర్పాట్లు శ్రీ జి. శివయ్య గారు ఉచితంగా ఏర్పాటుచేయుచున్నారు.

ఆశ్రమ ఉపాధ్యక్షులగు శ్రీ జి.ఎస్.రాజు గారు (సిరీస్, విజయవాడ) ఇటీవల ఆగస్టు నెలలో ఆశ్రమము సందర్శించిరి. అతిపెద్ద మందుల కంపెని ప్రొప్రైటర్ కావున వైద్యముయొక్క వివరాలు సేకరించుటలో వీరికి అభిలాష అధికము. వారు స్వయంగా ఆపరేషన్స్ గదిలో, డాక్టర్ గారు చేయు కంటి ఆపరేషన్స్ దగ్గరుండి పరిశీలించారు. అత్యంత సంతోషభరితులైనారు. వెంటనే విజయవాడకు వెళుతూ లోగడ వాగ్దానంచేసిన రు.1,00,000/-D.D.ద్వారా మరియు అవసరమైన మందులను కూడా పంపి, మమ్ములను ప్రోత్సాహపరచి రోగులకు సహకారము అందించినారు.

ఇతర జిల్లాలనుండి కూడా రోగులు వచ్చి చికిత్స బడయుచుండుట వీరు గమనించి ఆనందించిరి. వీరందరికి మా ధన్యవాదములు.

విశాఖపట్టణం జిల్లా యలమంచిలి గ్రామవాస్తవ్యులైన శ్రీ ఎమ్. అప్పారావు గారు భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రికి ఇదివరలో రు. 11,116/-లు పంపి శాశ్వత సభ్యులు (Life Member)గా చేరిరి. ఆసుపత్రి యొక్క అభివృద్ధిని గమనించి ఇపుడు వారు మరల రు. 11,116/-లు

విరాళమును పంపి నిర్వాహకులకు ప్రోత్సాహము కలిగించినారు.

1. డాక్టరు - శ్రీ ఎమ్.ఎస్. రామకృష్ణారావు గారు, M.S.D.O.
(Spl. CIVIL SURGEON (OPHTH)
2. కాంపౌండరు - శ్రీ ఎస్. చెంగయ్య గారు S.S.L.C.
3. క్లర్కు - శ్రీ ఐ. మురళికృష్ణ గారు, Inter
4. హెడ్ నర్సు - శ్రీ ఎస్. వర్ధినియా వసంతరాణి గారు, M.P.H.W. (F)
5. నర్సు - శ్రీ బి. మునిరత్నమ్మగారు, M.P.H.W. (F)
6. ఇతర సహాయకులు-
1. స్టోర్‌కీపర్ - శ్రీ ఎమ్.డి. రఫీ గారు, B.A., B.Ed.,
2. లాబ్ టెక్నీషియన్ - శ్రీ ఒ. దేవదానం గారు, Inter
3. వాషర్‌మన్ - శ్రీ వి. గురవయ్య గారు
4. స్వీపర్ - శ్రీ వి. రామానుజాలమ్మ గారు
5. వాచ్‌మన్ - శ్రీ గోపాల్ గారు

OO

| | రూ. |
|---|---|
| 1. శ్రీ గోకరాజు రామరాజు హెల్త్ & ఎడ్యుకేషన్ ఛారిటి ట్రస్ట్, SIRIS, విజయవాడ | 1,00,000/- |
| 2. శ్రీ పి.జె. చంద్రయ్య గారు, శ్రీకాళహస్తి | 11,116/- |
| 3. శ్రీ కె. రామేశమ్ గారు, మద్రాస్ | 11,116/- |
| 4. శ్రీ అగ్రహారపు గున్నయ్య గుప్త & సన్, విశాఖ | 11,116/- |
| 5. శ్రీ బి. గోపాలకృష్ణ అయ్యప్ప గారు, తిరుచానూరు | 6,116/- |
| 6. శ్రీ కె. తిమ్మయ్య గుప్త గారు, పుట్టపర్తి | 1,116/- |
| 7. శ్రీ పెండ్యాల పాండుగారు | 6,116/- |
| 8. శ్రీ వి.ఎస్.వి. సముద్రారావు గారు, హైదరాబాద్ | 1,116/- |
| 9. శ్రీ టి. వేంకటరామయ్య గారు, హైదరాబాద్ | 1,116/- |
| 10. శ్రీ వి.వి. నారాయణ గారు, హైదరాబాద్ | 116/- |
| 11. శ్రీ కోటగిరి మురళీకృష్ణారావు గారు, రామన్నగూడెం | 1,116/- |
| 12. శ్రీ ఎస్. రాములు గారు, మహబూబ్‌నగర్ | 1,116/- |
| 13. శ్రీ ఎస్. కన్నయ్య గారు, శ్రీకాళహస్తి | 1,116/- |
| 14. శ్రీ కె. మురుగేశన్ గారు, శ్రీకాళహస్తి | 316/- |
| 15. శ్రీ గొల్ల పెల్లయ్య గారు, పాలచ్చూరు | 116/- |
| 16. వి.బి బాలకృష్ణ గారు, నెల్లూరు | 216/- |

## రూ.116/- విరాళము ఒసంగిన దాతలు

శ్రీ యుతులు

17. ఆదినారాయణ, హైదరాబాద్
18. వండవెల్లి సత్యమ్మ, బ్రాహ్మణగూడెం
19. ఎం.ఎస్. క్రిష్ణయ్య, బెంగుళూరు
20. ఎస్. గోపాలయ్య, నంద్యాల
21. ఎస్. క్రిష్ణయ్య, కళ్యాణఖని
22. పి. సీతారామయ్య, ఒంగోలు
23. ఎం రఘురామిరెడ్డి, హైదరాబాద్
24. ఎం. నరసయ్య, ఎల్ల్కూరు
25. ఎల్. గీతామణి, చిన్నగుట్టికల్లు
26. మహేశ్వర క్లాత్ షోరూం, N.T.P.C.
27. కె. సీతమ్మ, కాకినాడ
28. కె. వెంకటేశ్వరరావు, ఏలూరు
29. బి. వేంకటరత్నలక్ష్మి నారాయణ, బెంగుళూరు
30. బి. పుష్పావతమ్మ, ఆదోని
31. కె. హరనాథ్, హైదరాబాద్
32. ఎం.కె. నాగభూషణం, బెంగుళూరు
33. కె. ధర్మరాజు, తుని
34. ఐ. పెద్ద కన్నియమ్మ, తుని
35. వి.ఆర్. రాజగోపాలశెట్టి గార్లు, బంగారపేట

## రూ.116/-లు పంపిన హైదరాబాద్ భక్తులు

శ్రీ యుతులు

36. ఎ. శ్యామ్‌సుందర్
37. బి. సావిత్రి
38. జి. సూర్యనారాయణ
39. ఎ.వి.ఎస్. రాజు
40. ఎస్. విజయకుమార్
41. కె. హనుమంతరావు
42. ఏకతామాతా సేవా పరిషత్
43. ఆర్. చంద్రశేఖర్‌రావు
44. కె. దక్షిణామూర్తి
45. డా॥ ఆర్. రాజగోపాల్ గార్లు.

## రూ.116/-లు ఒసంగిన కాకినాడ భక్తులు

*(సేకరించి పంపినవారు- శ్రీ కె.వి. శేషావతారం గారు, కాకినాడ)*

శ్రీ యుతులు

46. పి. సూర్యనారాయణ
47. దేవతా రామారావు
48. పి. సుబ్రమణ్యం
49. వి.ఆర్. బాధం
50. వి. క్రిష్ణబ్రహ్మం
51. గోవిందరాజులు
52. పైడా సత్యనారాయణమూర్తి
53. ఎస్. వెంకటేశ్వరరావు
54. కె. రామారావు
55. శ్రీ సత్యనారాయణమూర్తి
56. జి. చలపతిరావు
57. బచ్చు వాసుదేవామూర్తి
58. వై. ప్రసాద్
59. గుడిమెట్ల వేంకటేశ్వరరావు

60. నాళం అరుంధతి
61. నాళం రాజా
62. పోబోలు మంగరాజు
63 శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ సమాజం
64. బలభద్రుని మల్లికార్జునరావు
65. పైడా చలమయ్య
66. వి. సీతారామాంజనేయులు
67. సి. జానకీరామ్
68. వై. సూర్యనారాయణమూర్తి
69. పి. చంద్రమతి
70. కె. రాజ్యలక్ష్మి
71. కె. సురేంద్రనాథ్
72. వి.కె. రాజేశ్వరరావు
73. వి. మల్లేశ్వరరావు గార్లు.

శ్రీయుతులు

74. వై. గవర్రాజు 1,002/-
75. ఎం. సీతాదేవి,Hyd. 500/-
76. కడారి చెల్లాయమ్మ 200/-
77. పులవర్తి సీతారామమూర్తి 200/-
78. గజ్జల ప్రభాకరరావు 200/-
79. డా॥ ఎం.ఎస్.రెడ్డి 200/-
80. కె. వేంకటరత్నం గార్లు 202/-

## కృష్ణాజిల్లా -ఈదర భక్తులు ఒసంగిన విరాళములు

శ్రీయుతులు

81. దన్నపనేని ఉదయభాస్కర్‌రావు 520/-
82. కె. వెంకటశేషాచల సత్యనారాయణ స్వామి, నూజివీడు 500/-
83. కె. రమేష్, మాదికొండ 116/-
84. పి. వెంకటసుబ్బారావు 522/-
85. డి. లక్ష్మణరావు 116/-
86. డి. రామారావు 1,020/-
87. ఎస్. రామాయమ్మ, వెల్లిమర్లి 200/-
88. డి. సీతారామారావు 500/-
89. డి. నరసింహారావు 500/-
90. డి.రాంబాబు 116/-
91. శ్రీ మహాయోగిని వాసుదేవ గీతా సమాజం 200/-
92.ఎమ్.కోటేశ్వరరావు గార్లు 116/-

## రూ.116/-లు విరాళము నొసంగిన గద్వాల భక్తులు

(సేకరించి వంపినవారు- శ్రీ ఇల్లూరు రంగస్వామి గారు, గద్వాల)

శ్రీయుతులు

93. కె. కేశవయ్య
94. సివ్వ సువర్ణమ్మ
95. బచ్చు రాజగోపాల్
96. జి. పాండురంగన్న
97. ఐ. నాగిశెట్టి
98. ఐ. భద్రయ్య
99. గద్దం వెంకన్న
100. సంగా గోవిందు
101. పుట్టా తిమ్మప్ప
102. పచ్చిపులుసు పెద్దరాములు
103. ఉప్పల వెంకటరామిరెడ్డి
104. చెవ్వా నరసింహయ్య
105. బిలకంటి బలరామయ్య గార్లు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమములో వంటచేయుటకు
మంచి అనుభవం గలిగిన వంటమనిషి అవసరము.
ఉత్సాహవంతులు తమ పేరు, వయస్సు,
అడ్రసులతో అప్లికేషన్ పంపుకొనవచ్చును.
లేదా స్వయంగా వచ్చి సంప్రదించవచ్చును.

Anything that makes us weak physically, intellectually and spiritually, reject as poison.

మనలను శారీరకముగ, మానసికముగ, ఆధ్యాత్మికముగ దుర్బలపరచుదానివి విషమువలె త్యజించివేయుడు.

---

Truth is strengthening. Truth is purity. Truth is knowledge.

సత్యము ఎల్లప్పుడు బలవర్ధకమై, నిర్మలమై, జ్ఞానమయమై యుండును.

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada

**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1–21

## (సంగ్రహము)

## తీవ్రసంవేగానా మాసన్నః

*తా॥ సాధన తీవ్రముగ ఆచరించుచుండినచో లక్ష్యసిద్ధి త్వరగ చేకూరగలదు.*

వ్యాఖ్య : ఆత్మసాక్షాత్కారము, సమాధినిష్ఠ ముముక్షువు ఏ విధముగ పొందగలడో ఈ సూత్రమునందు నిరూపింపబడుచున్నది. గమ్యస్థానమును చేరదలంచువాడు పిపీలీకామార్గమున పోయినచో దీర్ఘకాలము పట్టును. పిపీలిక అనగా చీమ. చీమనడకవలె సాధనను కొనసాగించువాడు గమ్యస్థానమును ఎప్పటికో చేరుకొనగలడు. కాని విహంగమార్గమున చనువాడు అచిరకాలములోనే లక్ష్యమును చేరగలడు.

విహంగమనగా పక్షి. అధ్యాత్మరంగమున సాధన ఒనర్చు ముముక్షువు సంసారదుఃఖపరంపరల నుండి ఎంత త్వరగా తప్పించుకొని బ్రహ్మానందమను లక్ష్యమును చేరగలడో అంతమంచిది. ఒకచోటు ఆనందధామమని తెలిసినపుడు దానిని త్వరితముగ ఎందుకు చేరుకొనరాదు? సంసారదుఃఖ కూపములో బహుకాలము మ్రగ్గవలసిన పనియేమున్నది? కాబట్టి దైవసాక్షాత్కారమును శీఘ్రముగ పొందదలంచువాడు తన ఆధ్యాత్మిక సాధనను ద్విగుణీకృతము గావించుకొనవలెను. సమయమును వృథాగ గడుపరాదు. బాహ్యవిషయముల ఎడల విరక్తిని పెంచుకొనుచు, ఆత్మను గూర్చి మననము చేయుచు కాలమును సద్వినియోగపరచుకొనుచుండవలెను.